# ఐదేళ్ల ప్రణాళిక అమలే బడ్జెట్ ప్రధానాశయం

## ఆ దృష్టితో నేదాన్ని చూడాలని చింతామణి దేశముఖ్ విజ్ఞప్తి

న్యూఢిల్లీ, మార్చి 5: మూడో సం॥లో అడుగు పెడుతున్న పంచవర్ష నిర్మాణ పథకాన్ని అమలు జరపటమన్నదే బడ్జెట్ ప్రధానాశయం. అది సోషలిస్టు సిద్ధాంతాలనుబట్టి ఏర్పాటు చేయబడ్డదా, లేక కమ్యూనిస్టు సిద్ధాంతాలమీద నిర్మించబడ్డదా అన్న అంశాన్ని కాదు నేడు మనం పరిశీలించవలసింది. పథకంలో జాతి పెట్టుకున్న లక్ష్యాలను ఇది సాధించ గలుగుతుందా, లేదా అన్నదే మనం చూడాలి," అని ఆర్థిక మంత్రి దేశముఖ్ స్టేట్స్ కౌన్సిల్‌లో బడ్జెట్ మీద జరిగిన చర్చకు నేడు జవాబిస్తూ విజ్ఞప్తి చేశారు.

లోటును ద్రవ్యవిస్తరణ విధానం ద్వారా సరిపుచ్చటానికి బడ్జెట్‌లో చేయబడ్డ ప్రతిపాదననుగురించి ప్రస్తావిస్తూ, ఆ మొత్తం 290 కోట్లకు మించక [illegible] వచ్చునన్న అభిప్రాయాన్ని ఆయన వెల్లడించారు.

ప్లానింగు కమీషన్ లోటు బడ్జెట్ మొదలైంది ప్రస్తావిస్తూ ప్రస్తుతం ఆ మొత్తం 290 కోట్లనీ, విదేశీ సహాయం లభించకపోతే అది మరింత పెరుగుతుందనీ చెప్పారు. ద్రవ్యవిస్తరణ పద్ధతిని ప్రవేశపెడితే ముందుముందు ఏ ఫలితాలు రాగలవో యెవ్వరూ చెప్పలేరు. ప్రస్తుత పరిస్థితులనుబట్టి, ఆ విధానాన్ని అమలుజరిపితే మనకు పెద్దహాని కలగదని మాత్రం చెప్పగలను.

కొన్ని రాష్ట్రాలు పంచవర్ష పథకంలో కోరబడ్డ నిర్మాణసాధన సంపత్తులను సమకూర్చలేక పోయినమాట నిజమే కాని ఇంకా 3 సం॥ల వ్యవధి ఉన్నది కనుక ప్లానింగు కమీషన్ సూచించినట్లుగా, అభివృద్ధి పన్ను విధింపు, అమ్మకపుపన్ను పరిధి, రెవెన్యూ సర్ చార్జి విధింపు మొదలైన మార్గాలద్వారా ఆదాయాలను హెచ్చించుకోవచ్చును. ఈ మార్పులు లాభించకపోతే, దేశంలో పెట్టుబడి ఉండవలసినంత లేదన్నమాట. అప్పుడు కేంద్రం తన కాపిటల్ ఖర్చులను పెంచవలసి వస్తుంది. కొన్ని రాష్ట్రాలు కరువుకాటకాలవల్ల సాధనసంపత్తిని సమకూర్చలేక పోయినవన్న అంశాన్ని గుర్తించాను. ప్రభుత్వంలో దుబారాను అరికట్టటానికీ, పొదుపు చేయటానికీ ప్రత్యేకకృషి జరుగుతున్నది" అని ఆయన వివరించారు.

### కొరత ప్రాంతాల్లో ఆహారధరల తగ్గింపు

దేశంలో కరువు కాటకాలు చాల రేగినవనీ, సామాన్యమానవులకు ఒరిగిన దేమీ లేదనీ కమ్యూనిస్టు సభ్యులు చేసిన విమర్శలను ఆయన త్రోసివేశారు. కొరత ప్రాంతాల్లో ప్రజలకు పని చూపించటానికి చాలా చర్యలు తీసుకోబడినవనీ ఆయన కొన్ని లెక్కలను ఉదహరించారు. కొరత ప్రాంతాల్లో ఆహారధరలను తగ్గిస్తూ ఆహారమంత్రి త్వరలోనే ప్రకటన చేస్తారని ఆయన సూచించారు.

జి. రాజగోపాలన్ గారు కౌన్సిల్ లోనూ, వి. శేషంగారు ప్రజాసభలోను 'ఏ' 'బి' 'సి' రాష్ట్రాల విభేదాలను రద్దు చేయాలన్నారు.

మరణశిక్షల బిల్లును గురించి తెలియజేయాలనీ, ఆదివారాలుకూడా పోస్టాఫీసులు పనిచేసేటట్లుగా సిబ్బందిని పెంచాలనీ, హైదరాబాదును విభజించి విశాలాంధ్రలో కలపాలనీ పైడా వెంకటనారాయణగారు కౌన్సిల్లో అన్నారు.

ప్రజాసభలో మొత్తంమీద ప్రతికూల పక్ష సభ్యులు ద్రవ్యవిస్తరణ విధానాన్ని నిరసించగా, కాంగ్రెసు సభ్యులు బలపరిచారు.

## జఫ్రుల్లాఖాన్ రాజీనామా?

కరాచీ, మార్చి 5: పాకిస్థాన్ విదేశాంగమంత్రి జఫ్రుల్లాఖాన్ ప్రధాని నాజిముద్దీన్‌కు [illegible] రాజీనామా [illegible] ... [illegible] పోతున్న అశాంతి ఇతడి రాజీనామాకు కారణమని కూడా తెలుస్తున్నది.

పాకిస్థాన్ మొత్తంమీద ఆహారం సమృద్ధిగాలభ్యమయేరాష్ట్రం పంజాబు అక్కడే ఇప్పుడు దారుణమైన క్షామ పరిస్థితులు ఏర్పడినవనీ ఆ కారణం చేతే ప్రజల ఆందోళన తీవ్ర పరిణామానికి వచ్చిందనీ విషయజ్ఞులు అభిప్రాయ పడుతున్నారు. —యు. పి. ఐ.

### "సాగరు" జాతికి ఫీజు కన్సెషన్లు

మదరాసు, మార్చి 6: "సాగరు" జాతికి ఫీజు కన్సెషన్లను మంజూరు చేస్తూ ప్రభుత్వం ఉత్తర్వు చేసింది.

# ఆళవందార్ హత్యకేసు: హైకోర్టు విచారణ

## తల దొరికిన ప్రాంత పరిశీలనకు జ్యూరర్లతో న్యాయమూర్తి ప్రయాణం

మదరాసు, మార్చి 6: మదరాసు హైకోర్టు సెషన్సునందు నగర వర్తకుడు ఆళవందార్ హత్యకేసు విచారణ యీవాళ రెండవరోజు సాగింపబడింది. న్యా॥ ఎ. యస్. పి. అయ్యర్ గారు సెషన్సుకు అధ్యక్షత వహించారు.

ఆళవందార్ పతివ్రతయింతకమణి, చాకలిగోపాలన్, జెయిలులో మీనన్ వేలిముద్ర తీసిన కానిస్టేబిలు శివం వేలిముద్ర తీసిన వేలిముద్ర నిపుణుడు శ్రీ పరమేశ్వరన్ నాయరు యీ దినం ప్రాసిక్యూషను తరఫున సాక్ష్యమిచ్చారు.

ఆళవందార్ పతివ్రతయింతకమణి తన సాక్ష్యంలో తనకు 10 లేదా 11 యేండ్లక్రితం ఆళవందార్‌తో వివాహమైందనీ యిద్దరు బాలికలు ఒక బాలుడు జన్మించారనీ చెప్పింది. ఆమెకు ఒక ఫోటో చూపబడగా అది తనభర్త ఆళవందార్‌దని ఏడుస్తూ చెప్పింది.

1952 ఆగస్టు 28వ తేదీన ఎప్పటివలెనే ముందుగా ఉ. 8-30 గంటలకే ఆయన యిల్లు వదలిపెళ్లి [illegible] బంధించిన పనినిమిత్తం వెళ్ళుచున్నట్టు ఆయన చెప్పాడని ఆమె తెలిపింది. అదియే తను ఆళవందారును చూడడం కడపటిసారి అన్నది. ఆళవందార్ ఆరోజున విడిచిపోయినపుడు బిస్కుటురంగు బుష్ కోటు, చేతికడియారము, ఆకుపచ్చని మేజోళ్లు ఫౌంటన్‌పేనా ధరించియుండినట్లు ఆమె చెప్పింది. ఆ వస్తువులు ఆమెకు చూపబడినపుడు వాటిని గుర్తించి మళ్ళీ అమితంగా ఏడ్చింది. ఆమెకు చూపబడ్డ లోపల దొడుగులో నే చిన్నలాగు, చేతిగుడ్డకూడా ఆమె భర్త ఆళవందార్‌దని తమచాకలి వాడుకగా వేసిన గుర్తులవల్ల గుర్తించింది. తనకు గోపాల్ అనే చాకలి 10 యేండ్లనుండి గుడ్డలు ఉదుకుతున్నాడని తమ బట్టలకు మూడు చుక్కల గుర్తు వేయడం వాడుకయని ఆమె చెప్పింది.

ఆళవందార్ కుడిచెవిపైన రెండు చోట్లలో కుట్టబడియుండినవని ఆయన దంతం ఒకటి చాలా ముందుగా కన్పిస్తూ వచ్చిందనికూడా ఆమె తెలిపింది.

ముద్దాయిల న్యాయవాదులు ఆమెను క్రాసు పరీక్ష చేయలేదు.

చాకలి గోపాల్ ప్రాసిక్యూషన్ తరఫు సాక్ష్యమిస్తూ తను 10 యేండ్లకు పైగా ఆళవందార్ గుడ్డలను ఉతుకుచుండినట్లును వాటికి మూడు చుక్కల గుర్తు వేయడం వాడుకయని అన్నాడు. అతడుకూడా ఆళవందార్ చిన్నలాగు చేతిగుడ్డ గుర్తించాడు.

క్రాసు పరీక్షలో తానీ గుర్తు మరే వ్యక్తి గుడ్డలకు వేయలేదని అన్నాడు.

శ్రీ నరసింహమూర్తిగారు ఆళవందార్ మిలిటరీలో చేరినపుడు అతను [illegible] యిల్లు గోడలమీదనుండే రక్తసిక్తమైన చేతి ముద్రల ఫోటో తీసినట్లు తెలిపి వాటిని గుర్తుపట్టాడు. హెడ్ కానిస్టేబిలు జయరామ్ తను ముద్దాయి మీనన్ చేతిముద్ర జెయిలులో తీసినట్లు చెప్పాడు. వేలిముద్ర నిపుణుడు పరమేశ్వర నాయకర్ ఆళవందార్ శవం చేతిముద్రల ఫోటో తీసినట్లు తెలిపాడు.

అంతటితో నేరస్థుల పరిశీలనకోరకు సెషన్సు న్యా॥ ఎ. యస్. పి. అయ్యర్, జూరీవారు వెళ్లారు. వారు వెంట అందుకో, ముద్దాయి మీనన్ యిలు, మొండెంలేని తల దొరికిన బవర్ కుప్పములకు తనిఖీ నిమిత్తం వెళ్లారు.

విచారణ సమయమప్పుడు ముద్దాయిలు కోర్టులో కూర్చొనిచ్చే విషయమై కొంత చర్చ జరిగింది. ముద్దాయిలు కూర్చోటానికి తాను అనుమతి యిదివరకుకూడా యిచ్చితినని అదే విధమున యీ ముద్దాయిలుకూడా కూర్చోవచ్చున న్యాయమూర్తి అభిప్రాయం తెలిపారు. స్టేటు ప్రాసిక్యూటరు శ్రీ గోవిందస్వామి నాథన్ గారు ముద్దాయి కర్టూంజనములో కూర్చుంటే వారిముఖములు జూరీకి కనపడక పోవునేమో నన్నారు.

ముఖలక్షణాలను గమనించే జూరీ తీర్పు చేయదు గావున ముఖం ఎప్పుడూ తెలియడం అవసరం లేదేమోనని న్యాయమూర్తిగారు అన్నారు.

జూరీ ఫోర్మన్ ముద్దాయిల ముఖము కొంతవరకు చూస్తూఉండడం అవసరమే కావచ్చునని అన్నారు. దానిమీద సోమవారంనుండి ముద్దాయిలకు ఒక ఎత్తయినబల్ల వేయమని న్యాయమూర్తి ఆజ్ఞాపించారు.

# వాంచూ నివేదికపై నేడో, రేపో కేంద్ర ప్రభుత్వ చర్చ

## రాజాజీతో నెహ్రూ సమాలోచనకు ఏర్పాట్లు

న్యూఢిల్లీ, మార్చి 5: కేంద్రమంత్రివర్గం ఈ వారాంతాన సమావేశమైనప్పుడు ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయమై న్యాయమూర్తి కైలాసనాథ వాంచూ సమర్పించిన నివేదికను ఆలోచనకు తీసుకోవచ్చు.

మద్రాసు ముఖ్యమంత్రి సి. రాజగోపాలాచారి రేపు ఇక్కడికి చేరనున్నారు:

వాంచూ నివేదిక గురించి ఆయనతో స్వయంగా సంప్రతించే వుద్దేశంతో శ్రీ నెహ్రూగారే ఆయనను కాంగ్రెసు కార్యవర్గ సమావేశానికి ఒకటి రెండు రోజులు ముందుగా ఢిల్లీ రమ్మని కోరినట్లు తెలిసింది. శ్రీ రాజగోపాలాచారి మంత్రివర్గ సమావేశానికి కూడా ఆహూతుడు కావచ్చు. మంత్రి మండలి సభ్యులు ఆయనతో లోపాయికారీ చర్చలు కూడా జరుపుతారు.

ఆంధ్రరాష్ట్ర రాజధాని ఏ పరిస్థితిలోనూ మదరాసులో వుండరాదని ముఖ్యమంత్రి అభిప్రాయమైనట్లు ఇక్కడ అందరికీ తెలుసు. నగరంపై అధికారం ఏమీ లేకుండా కొంతకాలం పాటు వుండడంకానీ, దానికై దారితీసే మరేవిధమైన ఏర్పాటుకు కానీ ఆయన ఎంతమాత్రమూ సుముఖుడుగా లేడు.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సమస్య, వాంచూ నివేదికను పురస్కరించుకొని మళ్ళీ కాంగ్రెస్ కార్యవర్గ సమావేశంలో చర్చకు వచ్చే అవకాశం లేదంటున్నారు. కార్యవర్గానికీ, అ. భా. కాం. సంఘానికీ సంబంధించినంతవరకూ ఈ విషయం సాకల్యంగా పరిశీలించడం, హైదరాబాదు కాంగ్రెస్‌లో ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి నిశ్చయించడం అయిపోయింది. ఇక ఇప్పుడు ఆ నిర్ణయాన్ని అమలు జరిపే బాధ్యత ప్రభుత్వానిది. అయితే కాంగ్రెస్ అధ్యక్షుడు తలుచుకొంటే చర్చకు రావచ్చు. అజెండాలో మాత్రం ఇదేమీ లేదు.

### ప్రధానమంత్రి వద్దకు ఆంధ్రేతరుల రాయబారం

మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్రేతర ప్రాంతాలకు చెందిన పార్లమెంటు సభ్యులు 30 మందిదాకా నేడు ప్రధాని మంత్రిని సందర్శించి, ఆంధ్ర రాజధానిని తాత్కాలికంగా మద్రాసులో వుంచడం గురించీ, తత్సంబంధ సమస్యల గురించి తమ అభిప్రాయాలను ఆయనకు వివరించారు.

తమిళనాడు కాంగ్రెస్ సంఘ ప్రధాన కార్యదర్శి ఆర్. వెంకట్రామన్ నాయకత్వం వహించిన ఈ రాయబారి వర్గంలో కమ్యూనిస్టులు తప్ప తక్కిన సభ్యులు అన్ని పార్టీలవారూ వున్నారు. ఆంధ్రరాజధానిని మద్రాసులో తాత్కాలికంగా నైనా సరే మద్రాసులో వుంచే పక్షంలో అటువంటి తీర్మానాన్ని శాసనసభ చేస్తుందనుకోవటం పొరపాటని కూడా వారు తెలియచేశారు. రాజ్యాంగ సంబంధమైన చిక్కులు అనేకంతో కూడినట్టిదనీ, విరోధ భావాలు హెచ్చడానికీ, ఆంధ్రులకూ ఆంధ్రేతరులకూ వున్న సత్సంబంధాలు చెడడానికీ కారణమవుతుందనీ వారు తెలియచేశారు. మద్రాసు నగరంలో, నగరాన్ని "సి" రాష్ట్రం చేయాలన్న ఆందోళన కనక విషమరూపం దాల్చితే, పరిశేష రాజ్యం శాంతిభద్రతలను కాపాడడంలో చాలా చిక్కులు ఎదుర్కోవలసి వస్తుంది. అసలు ఆంధ్రులు ఇంతవరకూ తమ రాజధాని యెక్కడ వుండాలన్న విషయమై ఏకాభిప్రాయానికి రాలేదు. మద్రాసులో వుంచమనీ 3 లేక 5 ఏండ్లలో కూడా అట్టి అభిప్రాయానికి రాగల అవకాశం ఏమీ కనిపించదు అని కూడా వారు అన్నారు.

నూతన రాష్ట్రాన్ని ఏర్పాటు చేయడానికి మద్రాసు శాసనసభ ఒక తీర్మానం చేయడం రాజ్యాంగ సమ్మతమైన విధానాలలో ఒకటనీ, ఆంధ్ర రాజధానిని తాత్కాలికంగానైనా సరే మద్రాసులో వుంచే పక్షంలో అటువంటి తీర్మానాన్ని శాసనసభ చేస్తుందనుకోవటం పొరపాటని కూడా వారు తెలియ చేశారు. రాజ్యాంగ సంబంధమైన చిక్కులు కారణంగా హైకోర్టుకూడా సమష్టిగా వుండరాదని వారన్నారు. బళ్లారి జిల్లాలోని కన్నడ తాలూకాల విషయంలో అవి పరిశేష రాజ్యానికి సంక్లిష్టంగా వుండగలవన్నారు.

# బడ్జెట్ సమావేశానంతరం హైద్రాబాద్ మంత్రుల శాఖలమార్పు

## —ముఖ్యమంత్రి ప్రకటన

హైదరాబాదు, మార్చి 5: ప్రస్తుతం పదిమందితో కూడియున్న హైదరాబాదు మంత్రివర్గంలో తామేమీ తగ్గింపు చేయబోవటం లేదనీ, బడ్జెట్ సమావేశానంతరం పోర్టుఫోలియోల మాత్రం మార్చినచో మార్చవచ్చుననీ ముఖ్యమంత్రి బి. రామకృష్ణ రావుగారు ఇవాళ ఇక్కడ పత్రికావిలేఖరులతో చెప్పారు.

బడ్జెట్ సమావేశం జరుగుతున్నందువల్ల సహాయకుల పోర్టుపోలియోలలో ప్రస్తుతానికి ఏమార్పులూ చేయలేదనీ, దేసింహ్లా రాజీనామా పెట్టి వెళ్లిన మంత్రుల పోర్టుపోలియోలను తక్కినవారికి పంపిణీచేయడం మాత్రమేనని కూడా రామకృష్ణరావుగారు చెప్పారు.

# లంచగొండి తనానికై మైసూరు సర్జన్ అరెస్టు

మైసూరు, మార్చి 4: లంచం తీసుకొన్నాడన్న ఆరోపణ మీద నిన్నటి దినం పోలీసులు స్థానిక కృష్ణరాజమ్మణ్ణి ఉయగోగ వైద్యశాలలో అసిస్టెంటు సర్జనుగా ఉన్న టి. యల్. నారాయణగారిని అరెస్టు చేశారు.

ఆ ఆసుపత్రిలో చికిత్స పొందుతూ వుండి మరణించిన కె. ఆర్. కృష్ణమూర్తి అనే ఆయన తాలూకు భీమా మొత్తాన్ని పొందుటకై కృష్ణమూర్తిగారి సోదరుడు గోపాలకృష్ణ గారు నారాయణగారి దగ్గరకువెళ్లి మరణసర్టిఫికేట్టు యివ్వమని కోరగా ఆయన 50/- రు లంచమడిగాడనీ, అందుపైన గోపాలకృష్ణగారు ఈసంగతిని లంచవిరోధక పోలీసులకు తెల్పగా వారు గుర్తుచేసిన 25/- రు నోట్లను ఇచ్చి, డాక్టరుగారికి వాటిని ఇమ్మన్నట్లూ, ఆయన వెనువెంటనే వెళ్లిన పోలీసులు తక్షణం డాక్టరుగారిని అరెస్టు చేసినట్లూ తెలిసింది. లంచనిరోధ శాసనం యొక్క 5వ నిబంధన ప్రకారం డాక్టరుపైన కేసు దాఖలు చేసినట్లు కూడ తెలియవచ్చింది. —స్వ. వి.

# భారత నాయకుల సంతాపం

(1 వ పేజీ తరువాయి)

గుణపాఠంగా వుంటుందని భావిస్తున్నాను."

### బొంబాయి నగరంలో విచారం

స్టాలిను మరణవార్త బొంబాయి నగరంలో తీవ్రవిషాదాన్ని కల్గించింది. జనం వీధిచివరలను గుమిగూడి, స్టాలిన్ మరణాన్ని గూర్చి వార్తలను, ఇంకా యితర వార్తలను శ్రద్ధగా తెలుసుకుంటున్నారు. బొంబాయి ప్రభుత్వం కార్యాలయం మీద పతాకాన్ని జెండాకర్రకు సగానికి, విచార సూచకంగా జార్చారు.

### శ్రీఅజయఘోష్ సంతాపం

భారత కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి శ్రీ అజయఘోష్ నేడు బొంబాయిలో వున్నారు. ఆయన భారత కమ్యూనిస్టు పార్టీకేంద్ర కమిటీ తరఫున, సోవియట్ రష్యా కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీకి ఒక సానుతాపపం దేశాన్ని పంపించారు ఈసందేశంలో ఆయన మార్షల్ స్టాలిన్‌ను మానవుల లోకల్లా అతి ఉత్తముడనీ, శాంతి కాముకుల్లో ప్రథముడని మానవస్వాతంత్ర్య ఉద్యమానికి ఏకైక నాయకుడని అన్నారు. ప్రపంచంలో అన్ని దిశాలలోను, సర్వజనానికి స్టాలిన్ మరణవార్త తీవ్రవిషాదాన్ని కల్గించిందని, మానవచరిత్రలో అటె మహానాయకుడు న భూతో, న భవిష్యతి అని [illegible] ... [illegible] ప్రపంచంలో [illegible] స్టాలిన్ గురించిన ... [illegible] మరణించాడని [illegible].

### స్టాలిన్ కొంటినివాదీ

[illegible]

వస్తుందా అన్న ఆలోచనలు ఇక్కడ ఎక్కువైనాయి. అయితే, ఆమార్పును గూర్చి ఇదమిద్ధం అని ఇప్పుడు తేల్చి చెప్పడం అసాధ్యమని రాజకీయవర్గాల వారు అంటున్నారు. అదికాక ఇంత కుముందుకన్నా, ఇప్పుడు ఆస్థితి చెడిపోయేది ఏమీ లేదని అనుకుంటున్నారు.

### పి. రామమూర్తిగారి ప్రకటన

మద్రాసు, మార్చి 6: కమ్యూనిస్టు నాయకులు పి. రామమూర్తిగారు ఇలా చెప్పారు:

"స్టాలిన్ మరణంవల్ల యావత్తు కార్మికవర్గము, అధఃపతితుల ప్రపంచ పతితబాధితుల, యావత్ మానవకోటి అప్తుడు అయిన నాయకుని లోకం కోల్పోయింది. స్టాలిన్ అంత ఉన్నతి శిఖరాలను అందుకున్న రాజకీయనాయకుడు గతంలో లేడు. అయనపేరు విన్నంతనే ఆయన త్యాగగాథలు స్ఫురణకువస్తాయి. స్టాలిన్ గతించాడు గాని ఆయనబోధలు ప్రజాస్వామ్య, సామ్యవాద స్థాపనకు దాన్ని దివ్యకాంతులను చేకూర్చగలవు.

### సింహళ ప్రధాని సానుభూతి సందేశం

కొలంబో, మార్చి 6: సింహళ ప్రధానమంత్రి డడ్లీ సేనానాయకే స్టాలిన్ మరణవార్తవిని ఇలా వ్యాఖ్యానించారు: "స్టాలిన్ మృతి మాకు చెప్పరానంత విచారం కల్గించింది. ఈ మహా విపత్తులో రష్యాప్రజానీకానికి మా హృదయపూర్వకమైన సానుభూతిని అందజేయ కోరుతున్నాము. రష్యాకు ఇకపై అధినేతలు కాగలవారు అంతర్జాతీయంగా ఇతోధిక సామరస్యం ఏర్పడగలందులకు కృషి చేయగలరని ఆశిస్తున్నాము."

### ఒకేఒకవాక్యంలో ఐసెన్ హోవర్ సంతాపం

అమెరికా అధ్యక్షుడు ఐజన్ హోవర్ తన దేశం ప్రభుత్వంతరఫున ఒక్కే ఒక వాక్యంలో సానుతాపసందేశాన్ని రష్యాప్రభుత్వానికి అందజేశారు. ఆ సందేశం ఈ విధంగావుంది: "జనరల్ లిస్సిమో స్టాలిన్ మరణంపట్ల అమెరికా ప్రభుత్వం అధికారికంగా, రష్యా ప్రభుత్వానికి తన సానుతాపాన్ని తెలియజేస్తున్నది."

### బెంగుళూరులో సంతాపం

బెంగుళూరు, మార్చి 6: ఇచ్చట ప్రభుత్వంతాలూకు అన్ని భవనాలమీద, కమ్యూనిస్టుపార్టీ కార్యాలయం మీద జెండాలను, స్టాలిన్ మృతిపట్ల విచారసూచకంగా వాల్చారు.

### మద్రాసులో సంతాపం

మదరాసు, మార్చి 6: భారత ప్రభుత్వంవారి సూచన ననుసరించి రష్యన్ కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి, మంత్రిమండలి అధ్యక్షుడు మార్షల్ స్టాలిన్ మరణమునకు సంతాపసూచకముగ నగరములోని ప్రభుత్వభవనము లన్నింటిపైన జాతీయపతాకం సగానికి ఎగురవేయబడింది.

మరణవార్త తెలియగానే స్థానిక [illegible]

# లిగ్నైట్ బొగ్గుగనుల ప్రారంభోత్సవం

## నైవేలిలో ఉత్సాహభరితదృశ్యాలు

[ఆంధ్రపత్రిక ప్రత్యేక విలేఖరి]

మద్రాసు, మార్చి 6: "దక్షిణార్కాటు మండలం భూగర్భంలోఉన్న 'లిగ్నయిట్'ను సద్వినియోగానికి తేవడానికి మద్రాసుప్రభుత్వం సర్వశక్తులను వినియోగిస్తుందనీ, నా సహాయం, ప్రభుత్వసహాయ వాగ్దానం చేస్తున్నాను. కేంద్రప్రభుత్వం గూడా తగు సహాయంచేసేట్టు అన్నివిధాలా పట్టుపట్టగలమని గూడా హామీ ఇస్తున్నాను. ప్రజల సహకారంతో ఈ ఖనిజం ప్రయోజనానికి వచ్చి ఈప్రాంతాల పరిశ్రమలు వృద్ధిఅయి మద్రాసురాష్ట్ర సంపత్సౌభాగ్యాలు పెంపు గాగలవని ఆశిస్తున్నాను" అని మద్రాసుప్రభుత్వ పరిశ్రమల మంత్రి డా॥ ఉడిపి కృష్ణారావుగారు నిన్న సాయంత్రం నైవేలిలోని లిగ్నయిట్ ఖనిజఖననోత్సవాలను ప్రారంభిస్తూ చెప్పారు.

గనులున్న మైదానంలో మనోజ్ఞంగా అలంకృతమైన మండపంలోనా జరిగిన ఈ ఉత్సవాలకు రాజధానీ నగరంనుంచి మండల ముంతటనుంచీ వచ్చిన అధికార, అనధికార ప్రముఖులు విదేశీయ రాయబార కార్యాలయోద్యోగులు అనేకులయ్యారు. అనేకముంది ప్రజలు తమ పాలిట భాగ్యగనులను కన్నులార చూద్దామని తండోపతండాలుగా వచ్చారు.

గనుల ప్రత్యేక పరిశోధనోద్యోగి హెచ్. కె. ఘోష్ గారు ప్రభాత సమయాన ఘనపాఠీలు వేదఘోష చేస్తూండగా హోమాదికములు జరిపించి, కాళీపూజ చేశారు. మధ్యాహ్నం మంత్రిగారు రావడంతోనే మంగళవాద్య నాదములతో ఎదురేగి స్వాగతమిచ్చి సభామండపానికి తోడ్కొనివచ్చారు. జాతీయ పతాకాన్ని మంత్రిగారు ఎగరవెయ్యడంతో మధ్యాహ్నం ఉత్సవాలు ప్రారంభమైనవి. మద్రాసు ప్రభుత్వ అభివృద్ధిశాఖా కార్యదర్శి లాబో ప్రభుగారు స్వాగతమిచ్చిన తర్వాత మంత్రిగారు ప్రారంభోపన్యాసం చేశారు. [వీరి ఉభయుల ప్రసంగాలు ఆంధ్రపత్రికలో నిన్ననే ప్రకటించింది.]

హెచ్. కె. ఘోష్ గారు ప్రముఖులనుభాసిస్సులను చదివివినిపించారు. మద్రాసు ముఖ్యమంత్రి చక్రవర్తి రాజగోపాలాచారిగారు తమ సందేశంలో ఇల్లా తెలిపారు. "బొగ్గుయొక్క మహోత్సవం నిజంగా గారడీవంటిది. ఈ మహోత్కృష్టోద్యమం డాక్టరు కృష్ణరావుగారి హస్తవాసివల్ల జయప్రదమై విలసిల్ల గలదని ఆశిస్తున్నాను."

అనంతరం మద్రాసు పూర్వ ముఖ్యమంత్రి ఓమండూరు పెద్ది రామస్వామి రెడ్డిగారు ఈ సందర్భంలో ప్రసంగిస్తూ పూర్వం ఆ మహారణ్యములకు నిలయమైన ఈ మండలం ఈ గనుల ఖననంవల్ల ప్రజల దారిద్ర్యాన్ని పారద్రోలి మహోజ్వల సంపదని నూత్నశకాన్ని ఆరంభించ గలదని భగవంతుని ప్రార్థిస్తున్నా మన్నారు. సామాన్యంగా ప్రభుత్వ జాప్యంవల్ల జరిగే ఆలస్యం ఈ వ్యవహారంలో జరగకూడదని హెచ్చరించారు. స్వామి శుద్ధానంద భారతి భారతీయులంతా దేశాభివృద్ధికి పట్టుపంచి పని చెయ్యాలన్నారు. అతిథులకు అల్పాహారవిందు జరిగిన పిమ్మట అభివందనాలతో సభ ముగిసింది.

తర్వాత అతిథులు అక్కడ జరుగుతున్న ఖనన కార్యక్రమాన్ని, పరిశోధనా మందిరంలో జరుగుతున్న పరిశీలనలను తిలకించారు. 100 చ॥ మైళ్ల ప్రాంతంలో దాదాపు 200 అడుగుల లోతున ఈ ఖనిజం లభిస్తుందని భావిస్తున్నారు. ఇంతవరకు మూడు ప్రదేశాల్లో పరిశీలనలు జరిపారు. మూడో చోట పరిశోధన సఫలమైందట. 200 అ. లోతున ఊటనీరు జలజల ప్రవహిస్తున్నందున ఆ నీటిని తోడి, బొగ్గును బయటికి తీయడానికి యత్నాలు చేస్తున్నారు. ఈ సందర్భంలో ప్రత్యేకోద్యోగి ఘోష్ గారి దీక్షను అంతా ప్రశంసించారు.

పత్రికలు కొన్ని అనుబంధములను ప్రచురించాయి. చౌరస్తా లన్నింటిలో సున్నంతో "కామ్రేడ్ స్టాలిన్ మరణం" అని ప్రజలకు మరణవార్తను అందజేయుటకు వ్రాయబడింది.

మదరాసు అసెంబ్లీలో ప్రతిపక్ష నాయకుడు శ్రీ పి. రామమూర్తి (కమ్యూనిస్టు) కామ్రేడ్ స్టాలిన్ మరణంవల్ల కార్మికక్షేమం కోరే నాయకున్ని ప్రపంచంకోల్పోయిందని కమ్యూనిస్టునాయకుని మరణంగురించి ఒక ప్రకటన చేస్తూ అన్నారు.

"స్టాలిన్ వలె నైతిక రాజకీయ రంగాల్లో ఉన్నతిస్థాయి నందుకున్న నాయకుడు మరొకడు చరిత్రలో కనపడడు. ఆయనపేరే కోట్లకోలది జనం త్యాగానికి, సాహసానికి ప్రేరణగ వుండేది. స్టాలిన్ మరణించినా వారు ప్రవచించిన సిద్ధాంతాలు ఆచంద్రార్కం నిలిచివుండి మానవజాతి పురోభివృద్ధికి, శాశ్వత శాంతికీ, స్వేచ్ఛ, ప్రజాస్వామ్య సాంఘిక న్యాయములకు ఆదర్శంగ వుండగలవు" అని శ్రీ రామమూర్తి అన్నారు.

### హైద్రాబాదు ప్రంటు సంతాపం

సికిందరాబాదు, మార్చి 6: హైదరాబాదు శాసనసభలో పీపుల్సు డెమాక్రటిక్ ఫ్రంటుకు చెందిన సభ్యులు నేటి ఉదయం అత్యవసర సభజరిపి మార్షల్ స్టాలిన్ మృతికి విచారం తెలుపుతూ ఒక సంతాప తీర్మానం చేశారు. ఆయన మరణం [illegible] ... [illegible] కూడాను.

మద్రాసు, మార్చి 6: రాయపురం గొల్లవారి అగ్రహారం సోడా దుకాణం కాంపోండులోని ఒక ఎలెక్ట్రిక్ స్తంభానికి సంపంగి అనే వంటకత్తె (45) శవం తాటితో వేళ్లాడగట్టబడి ఉన్నదని పోలీసులు కనుకున్నారు.

# 'అసందర్భ వార్త'

## ప్రకాశంగారి ప్రకటన

మద్రాసు, మార్చి 6: "ఏవో ఉద్దేశ్యాలు మనస్సులో పెట్టుకొని కలతలు పుట్టించడానికి కొందరు ప్రచురించే వార్తలను ప్రజలు నమ్మరాదు. నాకు సంబంధించి ప్రచురింపబడిన వార్త సమయము, సందర్భము లేనిది," అని టంగుటూరి ప్రకాశం పంతులుగారు ఒక గౌరవ సభ్యుడు తన రాష్ట్ర అసెంబ్లీ స్థానానికి రాజీనామా ఇచ్చి, ఆ స్థానానికి ప్రకాశంగారు ఎన్నికకు నిలబడనున్నారు. అని ఒక తెలుగు దిన పత్రిక ప్రకటించిన వార్తపై ఆంధ్ర పత్రిక ప్రతినిధి అడగ్గా చెప్పారు.

పంతులుగారు ఇవాళ రాత్రి ఆంధ్ర దేశ పర్యటనకు వెడుతున్నారు.

### బ్రిటిష్ సమాచార శాఖ

మదరాసు, మార్చి 6: బ్రిటిషు సమాచార శాఖవారు శనివారంసాయంత్రం 6½ గంటలకు మద్రాసు సాంఘిక సాంస్కృతికసంఘం త్యాగరాయనగరంలో కొన్ని ఫిల్ములను ప్రదర్శిస్తారు.

### చిత్రకళా ప్రదర్శనం

మద్రాసు, మార్చి 6: ఓ. దేవదాయ శాఖమంత్రి కత్తె శంకరస్వామి నాయుడుగారు స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్సులో మార్చి 7వ తేదీ ఉదయం 9 గంటలకు చిత్రకళా ప్రదర్శనాన్ని ప్రారంభిస్తారు. మార్చి 1[illegible] వరకు ప్రదర్శనం ఉదయం 9 నుంచి మధ్యాహ్నం 7 వరకు తెరచి ఉంటుంది.

### రాజాజీ ఢిల్లీప్రయాణం

మద్రాసు, మార్చి 6: మద్రాసు ముఖ్యమంత్రి చక్రవర్తి రాజగోపాలాచారిగారు ప్రధానమంత్రి శ్రీ నెహ్రూగారి ఆహ్వానంపై ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని గూర్చి చర్చించడానికి, 8వ తేదీ కాంగ్రెసు కార్యసంఘ సమావేశానికి హాజరు కావడానికై ఇవాళ విమానంలో ఢిల్లీ వెళ్లారు. ఆయన రాత్రి 11 కు మద్రాసు తిరిగివస్తారు. కె. కామరాజ నాడారు, ఎం. భక్తవత్సలంగారలు నిన్నరాత్రి విమానంలో ఢిల్లీవెళ్లారు.

మద్రాసు, మార్చి 6. శ్రీ ఎం. పి. శివజ్ఞాన గ్రామణిగారు 8 తేదీ సోమవారం సాయంత్రం కొండితోపు అమ్మన్ కోవెలవీధి కార్పొరేషను పఠనాలయంలో పిల్లల లైబ్రరీని తెరుస్తారు.

# శ్రీరామాపురంలో మంచినీటి ఎద్దడి

## సత్వరచర్యకు గ్రామసేవా సంఘంవారి విజ్ఞప్తి

రాజమండ్రి, మార్చి 6: రాజమండ్రి తాలూకా బోరుసుపాడి ఫిర్కాలోని శ్రీరామాపురంలో మంచినీళ్ళకు పెద్దకరువు వచ్చింది. మానవులూ జంతువులు కూడా త్రాగడానికి మంచినీళ్ళు లేవు. ఆ గ్రామంలో మొత్తం 14 వందలమంది ప్రజలున్నారు. ఆ గ్రామంలోవున్న మంచినీళ్ళ చెరువు ఒకటి ఎండిపోయినందున త్రాగడానికి నీళ్లు లేక గత పదిహేనురోజులనుంచీ బాధలు మరీ యెక్కువయినవట. ఆ గ్రామం రాజమండ్రికి అయిదుమైళ్ళ దూరంలోవున్నది. ఆ గ్రామపరిస్థితులను పరిశీలించి తక్షణం గొట్టపుబావి ఏర్పాటు చేయించమని ప్రభుత్వాన్ని అర్థిస్తూ ఆ గ్రామంలోని గ్రామసేవా సంఘం అధ్యక్షులు సి. బాపిరాజు, ఉపాధ్యక్షులు బి. వెంకటరాజు, కార్యదర్శి పి. పట్టాభి సహాయ కార్యదర్శి ఎమ్. వాసిరాజు, కోశాధికారి ఎమ్. సత్యనారాయణలు తూర్పుగోదావరిజిల్లా కలెక్టరుకు, గ్రామ సంక్షేమశాఖాధికారి, శాసనసభ్యుడు ఎస్. రామారావు తదితర అధికారులకు మహజరు పంపించారు.

## నోటీసు

ప్రస్తుతం కృష్ణా జిల్లా తోటవల్లూరు కాపురస్తులను మా కంపెనీ నెంబరు 62124 రు పట్టాదారున్నూ అయిన వేము సీతారావమ్మగారు మాచే తమ కొసంగిన పట్టా యెచ్చటనో పోయినదని తెలుపుచూ డూప్లికేటు పట్టాను కోరియుండిరి. కావున యీ తేదీ లగాయతు నెల దినములలోపుగా యెవరికి యెట్టి ఆక్షేపణలు లేనిచో డూప్లికేటు పట్టా జారీ చేయబడును.

(సం) ధూర్జటి సుబ్రహ్మణ్యం,
ఎం. ఏ., ఎఫ్. ఐ. ఏ., ఎఫ్ ఎస్. ఎస్.,
జనరల్ మేనేజర్,
ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్,
మచిలీపట్నం. తేదీ 4-3-53.

## వేలము ప్రకటన

### పెనుగొండ పంచాయతీ ఆఫీసు

పెనుగొండ పంచాయతీకి చెంది యున్నటువంటి. (1) మామూలు సంత మార్కెట్‌లోనూ. (2) పశువుల సంత మార్కెట్‌లోనూ. (3) రోజువారి మార్కెట్‌లోనూ. (4) బళ్ళ ఘాటీలలోనూ. (5) కబేళాలోనూ. (6) గడ్డి మార్కెట్ లలోనూ 1953-54 సంవత్సరమునకు రుసుములు వసూలుచేసికొను హక్కులనూ. (7) పశువుల మార్కెట్‌లో పేడపోగు జేసికొని తీసికొనివెళ్లు హక్కున్నూ. (8) సంత మార్కెట్‌లలో తుక్కు. చెత్తలను పోగు జేసికొని తీసికొనివెళ్లు హక్కున్నూ 14-3-1953 వ తేదీ మధ్యాహ్నం 2.0 గంటలనుండి సాయంత్రం 5.0 గంటల వరకూ. పెనుగొండ పంచాయతీ ఆఫీసులో బహిరంగముగా వేలము వేయబడునని ఇందుమూలముగా ప్రచుర పర్చడమైనది. షరతులు వగైరా ఇతర వివరములు కావలసినవారు ఆఫీసు పనిచేయు దినములలో, ఆఫీసు టైములో, ఈ దిగువ సంతకము చేసినవారినుండి ఐదయగలరు.

(సం) యస్. అకలంకస్వామి.
ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు పెనుగొండ
2-3-1953. (పశ్చిమగోదావరిజిల్లా)

## దక్షిణ రైల్వే.

### మద్రాసు జిల్లా, ఛాంపియన్ స్టేషనులో, స్టేషన్ బిల్డింగు తిరుగ విప్పికట్టుట, "ఏ" & "బి" టైపు స్టాఫ్ క్వార్టర్సు కట్టుటకు టెండర్లు,

పై పనికి సీలు వేసిన టెండర్లు మద్రాసు - 18, రాయపురం, దక్షిణ రైల్వే, డివిజనల్ ఇంజనీరు గారిచే 25-3-1953 తేది బుధవారము మధ్యాహ్నము 12 గంటలవరకు దాఖలు చేసికొనబడును.

టెండర్లు నిర్ణీత ఫారములో ఉండవలెను. సదరు టెండరు ఫారములు వాటి ఖరీదు క్రింద రు. 10/-లు (పది రూపాయలు మాత్రమే) మద్రాసు-3, సెంట్రల్ డీజన్, డివిజనల్ అకౌంట్సు ఆఫీసరుకు చెల్లించి, సదరు రశీదును చూపించి, డివిజనల్ ఇంజనీరువారి ఆఫీసువద్ద పొందవచ్చును.

ఏ సందర్భములలో నైనను టెండరు ఫారముల ఖరీదు వాపసు చేయబడదు.

టెండరు ఫారములు 24-3-1953 తేది మంగళవారము మధ్యాహ్నము 3 గంటలవరకు జారీ చేయబడును.

టెండరుదార్లు తమ టెండర్లతో బాటుకే పన్ను అమ్మకము పన్ను చెల్లించిన సర్టిఫికెట్లను పంపవలెను.

మద్రాసు - 3, సెంట్రల్ డీజన్, డివిజనల్ అకౌంట్సు ఆఫీసరుగారికి ముందుగా బయానా సొమ్ము రు. 1,400/-లు 24-3-1953 తేది మంగళవారము సాయంత్రము 3.0 గంటలలోగా చెల్లించవలెను.

పని విలువ సుమారు రు. 69,000/-

కనీసపు టెండరును గాని, మరి యే టెండరును గాని అంగీకరింపవలసిన బాధ్యత డివిజనల్ ఇంజనీరుగారికి లేదు.

మధుర కమ్యూనిటీ ప్రాజెక్టు 'రెవెల్ వర్కర్ల శిక్షణ కేంద్రం'లో క్రొత్తగా నిర్మింపబడిన భవనాలను మద్రాసు ప్రధాని శ్రీ సి. రాజగోపాలాచారిగారు మార్చి 3 తేదీన ప్రారంభోత్సవం చేస్తూ: రంగుపుల్లలతో అలంకరింపబడిన మధ్య హాలులో దీపారాధన చేశారు.

మధుర 'లేడీ డోక్ మహిళా కళాశాల'వారు యేర్పాటుచేసిన వినోదకళామహోత్సవాలకు మద్రాసు ప్రధాని శ్రీ సి. రాజగోపాలాచారిగారు. మార్చి 3 వ తేదీన ప్రారంభోత్సవం జరిపారు లాంఛనప్రాయంగా రిబ్బన్ కత్తిరించుచున్న దృశ్యం.

కర్నూలు గవర్నమెంటు ట్రైనింగు కాలేజి ప్రథమ వార్షికోత్సవం సందర్భమున తీసిన ఛాయాచిత్రం ముందు నిలబడిన నలుగురు; కుడినుండి ఎడమకు: మద్రాసు గృహనిర్మాణ సహకారశాఖామంత్రి డి. సంజీవయ్య, జిల్లాకలెక్టరు పి. వి. మాధవ రావు, కాలేజి ప్రిన్సిపాల్ డా॥ ని ని రావు, డిప్యూటీ కలెక్టరు టి. జె. దొరెరాజు.

జమ్మూ - కాశ్మీరు ప్రధాని షేక్ మహమ్మదు అబుల్లాతో ఆస్ట్రేలియన్ ప్రెస్ కమిషనర్ సభ్యులు డా॥ పీటర్ రూసో, జె. గూడ్, జి. హారియట్, మారిస్ సింప్సన్, డగ్లస్ విల్కిగార్ల గోష్ఠి.

అమెరికాలోని కార్మిక-నిర్వాహక సంబంధాలను పరిశీలించి రావడానికై నాలుగు మాసాల పర్యటన నిమిత్తం బొంబాయినుంచి యిటీవలనే బయలుదేరిన భారతి కార్మిక సంబంధాల నిపుణుల జట్టు.

రాజమండ్రి (రూరల్ వెల్‌ఫేర్ ఆఫీసరు) గ్రామాభ్యుదయ శాఖాధికారి శ్రీ మంగిపూడి కామేశ్వరశర్మగారికి సదరు శాఖోద్యోగులు గోదావరిస్టేషనులో స్వాగతమిచ్చిన దృశ్యం.

## అమ్మకం పన్ను విధింపు

### సుప్రీమ్ కోర్టులో కేరళ ప్రభుత్వ అపీలు విచారణ

న్యూఢిల్లీ, మార్చి 4: తిరువాన్కూరు-కొచ్చిన్ ప్రభుత్వం వారు విధించిన అమ్మకాల పన్ను రాజ్యాంగవిధానమునందలి 286 (1) (20) సెక్షను క్రింద మినహాయింపుల క్రిందికి వస్తుందని కేరళ హైకోర్టు చేసిన నిర్ణయంపై ప్రభుత్వంవారు దాఖలుచేసిన అపీలు నేడు సుప్రీమ్ కోర్టులో విచారణకు వచ్చింది.

కేరళ హైకోర్టు తీర్పు సక్రమమైనది కాదని, తిరువాన్కూరు-కొచ్చిన్ అడ్వొకేట్ జనరల్ వాదించారు. ఈ వాదాన్ని మదరాసు, పంజాబు, మైసూరు, హైదరాబాదు అడ్వకేట్లు-జనరలు నేడు సమర్థించారు.

ప్రతివాదుల అడ్వొకేటు వాదం ప్రారంభించగానే కోర్టువారు లేచారు.

## రెండేళ్లలో భాషా రాష్ట్రాలన్నిటి ఏర్పాటు

### స్వామి సీతారాం ఆశాభావం

ఖరగ్‌పూరు, మార్చి 5: రెండు సంవత్సరాల్లో భాషాధారక రాష్ట్రాలు యేర్పడుతవి. ఆంధ్రరాష్ట్ర స్థాపనము యిందుకు మొదటిచర్య అని సుప్రసిద్ధ ఆంధ్రనాయకులు శ్రీ స్వామీ సీతారాంగారు యిక్కడ ప్రకటించారు.

మంగళవారంనాడు యిక్కడ జరిగిన ఆంధ్రుల సభలో ఉపన్యసిస్తూ స్వామీజీ ఇలా అన్నారు: భాషా రాష్ట్రాల నిర్మాణము, భూమిని ప్రజలకు సమంగా పంచడము సర్వోదయ మూలసూత్రాలై వున్నవి. ఈ రెండు ఉద్యమాల్లోనూ ఆంధ్రులు నాయకత్వం వహించినందుకు నేను యెంతైనా గర్వపడుతున్నాను. ఆంధ్రరాష్ట్రమును యేర్పరచాలని భారతి ప్రభుత్వమువారు వేగిరపడుతున్నారు. అధ్యక్షునితో ను, ప్రధానితోను మాట్లాడడం వల్ల నాకు ఈ విషయం వ్యక్తమైంది."

"సర్వోదయ వ్యవస్థలో ఆహార ధాన్యాల కొరతే వుండరాదు. ప్రధాన వస్తువులపై కంట్రోలు వుండరాదు. సర్వోదయమంటే యిదే. ఈ ఆశయంతోనే ఆచార్య వినోబాభావేగారు భూదానయజ్ఞం ప్రారంభించారు. ఇందువల్ల కొంత ఆహారం ఉత్పత్తిచేసే అవకాశం అందరికి యేర్పడింది" అని స్వామీ సీతారాంగారు అన్నారు.

చండిల్‌లో జరిగే సర్వోదయ సమ్మేళనకు స్వామిజీ వెళ్లుతున్నారు.

## జగ్గయ్యపేటలో నీటి యిబ్బంది

### ప్రభుత్వానికి విజ్ఞప్తి

జగ్గయ్యపేట, మార్చి 4: స్థానిక పంచాయతీ బోర్డువారు శేషారాములుగారి అధ్యక్షతన యిటీవల సమావేశమై పట్టణంలో ప్రజలు మంచి నీటికి చాలా యిబ్బంది పడుతున్నారని, నీటి సరఫరా స్కీమును, విద్యుచ్ఛక్తి సరఫరా స్కీమును త్వరలో అమలు పరచాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేయుటకు తీర్మానించారు.

నూతన సంవత్సరం బెండర్లకు, వేలం పాటలకు శేకీలు, షరతులు నిర్ణయిస్తు తీర్మానించారు.

## గోమతేశ్వరుని మహా మస్తకాభిషేకం

### శ్రావణబెళగోళకు 5 లక్షల జైనయాత్రికుల రాక

బెంగుళూరు, మార్చి 4: గోమతేశ్వరుడను బరగే బాహుబలి స్వామికి రేపు జరుగనున్న మహామస్తకాభిషేక ఉత్సవాన్ని పురస్కరించుకొని అతి చిన్న కుగ్రామమైన శ్రావణబెళగొళ నేడు రమారమి 5 లక్షలమంది జైనయాత్రికులతో కిటకిటలాడిపోతూ వుంది.

పదమూడేండ్లకొకసారి జరిగే ఈ ఉత్సవాన్ని చూచే కుతూహలంతో అస్సాం, కాశ్మీరు మొదలైన మూలమూలల ప్రాంతాల నుంచికూడ వేలాదిమంది దిగంబరజైనులు - పురుషులు, స్త్రీలు, పిల్లలు - ఇక్కడికి కష్టనిష్ఠురాల నన్నిటినీ ఎంతమాత్రమూ సరకు సేయకుండా, తిండితీర్థాలకూ, నిలువ నీడకూ ఎంత ఇబ్బందిగా ఉన్నా కూడా విపరీతంగా మూగిపోయారు. వచ్చేజనం ఇంకా ఎడతెగకుండా వస్తూనే వున్నారు. బస్సులూ, బండ్లూ చాలక లారీలుకూడ జనాన్ని ఎక్కించుకొని వస్తున్నాయి.

ఊళ్ళోని కొద్దిపాటి విడిది ఇండ్లూ క్రొత్తగా వేసిన కొన్ని పూరి గుడిసెలూ ఈ జనానికి నివాసాలకూ చాలక పోగా దాదాపు రెండు లక్షలమంది నిశ్చింతగా పొలాలను ఆశ్రయించారు.

నిలువనీడకు కొంతఇబ్బందిగాఉన్నప్పటికీ తిండిగింజలకూ, తీర్థానికి కష్టం లేకుండా అధికారులు చక్కని ఏర్పాట్లుచేశారు. తిండిగింజలకు తాలెడన్ని డిపోలు పెట్టారు ఇసుక పొరుగుల్లోని చెరువులనుండి గొట్టాలు పెట్టి మంచి నీటికి మంచి ఏర్పాట్లు చేశారు.

యాత్రికులు తమ విలువైన వస్తువులను జాగ్రత్తగా దాచుకోవడానికి కొండ యడుగున, లిగిన కొపలా బందోబస్తులో ఒక 'భద్రాగారాన్ని' ఏర్పాటుచేసి పెట్టారు.

కొండమీదికి వెళ్లే మెట్లవరుస పొడుగునా రంగురంగుల దీపాల తోరణాలను తీర్చారు.

రేపు జరుగనున్న మహోత్సవాన్ని

## గుంతకల్లు మున్సిపల్ బడ్జెటు

### పురపాలకసంఘ ఆమోదం

గుంతకల్లు, మార్చి 4: స్థానిక పురపాలకసంఘంవారు క్రితంవారం ఛైర్మన్ దావూదు సాహెబ్ గారి అధ్యక్షతన సమావేశమై 52-54 బడ్జెట్ రివైజ్డు అంచనాలను 1953-55 బడ్జెట్ అంచనాలను ఆమోదించారు. 1953-54 సం॥ రం బడ్జెట్ ప్రతిపాదనలను కమీషనర్ షేక్ షరీఫ్ సాహెబ్ గారు ప్రతిపాదిస్తూ, బడ్జెట్ ప్రారంభ నిల్వ 341 వేల రూ.లని, ముగింపు నిల్వ 170 వేల రూ.లను, సగటు రాబడి 1190825 రూ.లని తెలియజేశారు. బడ్జెటు సబ్ కమిటీ శిఫార్సు చేసిన ప్రకారం 53-54 సం.రంలో యీ దిగువ పనులకు డబ్బు కేటాయించారు: సిమెంటురోడ్ల నిర్మాణానికి 210 వేలు, పాకీ పనివారల గృహనిర్మాణానికి 50 వేలు రూ.లు ప్రసూతి ఆస్పత్రి భవన నిర్మాణానికి 30 వేల రూ.లు ప్రయాణీకుల షెడ్డు నిర్మాణానికి 15 వేల రూ.లు ఆయుర్వేద యూనానీ ఆస్పత్రులకు 10 వేల రూ.లు కసవుతోట్లకు 2 వేల రూ.లు వైద్యశాలలకు 6 వేల రూ.లు పశువుల ఆస్పత్రికి 15 వేల రూ.లు పంతివార్కులు అభివృద్ధికి 1 లక్ష రూ.లు ప్రాథమిక పాఠశాలలకు 30 వేల రూ.లు గ్రంథాలయాలకు 8 వేలు, శోభిఖానాకు 5 వేల రూ.లు ఆస్పత్రిలో ఒక వార్డు నిర్మాణానికి 10 వేలు, స్మశానంలో షాకర్యాలకు 5 వేలు ఈ మొత్తముగాక జనరల్ అకౌంటు నుండి 240441 రూ.లు ఖర్చు పెట్టబడెను.

కౌన్సిలర్ టి. యం. నుస్రుకటీ, జె. ఆర్. లింగం, ప్రతిపక్ష సభ్యులు ఎ. రాయప్పగారలు, కమీషనరును, ఛైర్మన్‌ను ప్రశంసిస్తూ మాట్లాడారు. (స్వ. వి.)

మున్సిపటుతో చూచి కన్నుల పండుగు చేసుకొనడానికి యాత్రికులందరూనికీ షీస్తూ కూర్చున్నారు.

## బందరులో ఇళ్ల పన్నులు హెచ్చింపు

### 7 వ వార్డు రేటుపేయర్ల నిరసన

బందరు, మార్చి 4: ఈపట్టణంలోని 7 వ వార్డు రేటుపేయర్లు క్రితం శనివారంనాడు జన్యుల్లమడక లక్ష్మీనారాయణగారి అధ్యక్షతన సమావేశమై, పురపాలక సంఘ పరిపాలనను, ముఖ్యంగా పన్నుల హెచ్చింపు విధానాన్ని నిశితంగా విమర్శిస్తూ తీర్మానాలు చేశారు.

నూతనంగా కట్టే పేటలకు సరియైన రోడ్లు అవుట్‌లు, రోడ్లు వగైరా లేమీ లేకుండా ఇండ్లు కట్టుకోవడానికి అనుమతి యిస్తున్నారని, ఆ పేటలలో మంచినీటి సరఫరా వీధిదీపాలు వగైరా సౌకర్యాలేమీ లేకపోయినా, యధా ప్రకారమే పన్నులు వసూలు చేస్తున్నారని, జిల్లా మున్సిపల్ చట్ట నిబంధనల ప్రకారం యేయే సౌకర్యాలు లేవో, వాటికి సంబంధించినంతవరకు పన్నులు మినహాయింపు చేయవలసి ఉన్నప్పటికీ పూర్తి పన్ను వసూలు చేయడం శోచనీయమని విమర్శించారు.

రోడ్ల ప్రక్కన దుకాణాలు పెరుగుతున్నందున ప్రజల రాకపోకలకు చాలా యిబ్బందిగా వున్నదని, యీ దుకాణాలను తొలగించడం అవసరమని సూచిస్తూ తీర్మానం చేశారు. మధ్యరకం, బీదప్రజల యింటిపన్నులు హెచ్చించడం న్యాయం కాదని వీటిని తగ్గించాలని కోరారు.

1-4-53 తేదీనుండి హెచ్చించ దలచుకొన్న ఇంటిపన్ను, స్కావెంజింగ్ (పాకీపని) పన్ను హెచ్చించరాదని పన్నులు సక్రమంగా న్యాయంగా విధించి, వసూలు చేస్తే, పన్ను హెచ్చించడం ద్వారా లభించే ఆదాయంకన్నా హెచ్చు ఆదాయం రాగలదని, పురపాలక సంఘానికి సూచిస్తూ మరో తీర్మానం చేశారు.

మదరాసు, మార్చి 5: హయ్యర్ ఎలిమెంటరీ నేను ట్రయినింగ్ పొందిన టీచర్లు, పండితులు ప్రవేశిక ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షకు హాజరౌను టకు ఇచ్చిన గడువును 1955 మార్చి వరకు పొడిగిస్తూ మదరాసు ప్రభుత్వం ఉత్తర్వు చేసింది.

## అన్యదేశంపట్ల భక్తి విశ్వాసప్రమాణం

### భారతీయుడు చేయరాదని లక్ష్మీ మీనన్

న్యూఢిల్లీ, మార్చి 4: తన దేశంపట్ల రాజ్యాంగంపట్ల చూపదగిన భక్తివిశ్వాసాలకు అంతరాయం కలిగించే ఏ ప్రమాణమునూ భారతపౌరులు చేయకూడదని ప్రధాని పార్లమెంటరీ కార్యదర్శి శ్రీమతి లక్ష్మీమీనన్ నేడు కౌన్సిల్ ఆఫ్ స్టేట్సులో ప్రకటించింది.

అమెరికన్ ప్రభుత్వంయెడల భక్తిప్రపత్తులు ప్రకటించే ప్రమాణంపై సంతకం చేయాలని అమెరికాకు ప్రొఫెసర్‌గా వెళ్లిన ఒక భారత విద్వాంసుణ్ణి అమెరికన్ ప్రభుత్వం కోరినట్లు భారత ప్రభుత్వానికి తెలియునా? అని శ్రీ పి. సుందరయ్యగారు అడగ్గా శ్రీమతి మీనన్ ఇలా చెప్పింది: "అమెరికన్ ప్రభుత్వంపట్ల భక్తివిశ్వాసాలు ప్రకటించే ప్రమాణంపై సంతకంచేయడం యిష్టం కాక పోవడంవల్ల డా॥ డి. ఎన్. మజుందారు కాలిఫోర్నియాలో ప్రొఫెసర్ పదవిని నిరాకరించినట్లు పత్రికలలో ప్రకటితమైంది. అంతకు మినహా ప్రభుత్వంవారి కేమీ తెలియదు.

ఇంకా ప్రశ్నించగా పత్రికాప్రకటన మినహా తమకు సమాచారమేమీ తెలియదని, నిజం తెలుసుకోడానికి తాము డా॥ మజుందారుకు వ్రాస్తున్నారని ప్రధాని తెలిపారు.

## ఏలూరు మున్సిపల్ కమిటీలు

### అప్పాయంట్‌మెంట్సు కమిటీకి లాటరీద్వారా సభ్యుని ఎన్నిక

ఏలూరు, మార్చి 4: ఏలూరు పురపాలక సంఘంవారి కంట్రాక్ట్సు కమిటీకి, అప్పాయింట్‌మెంట్సు కమిటీకి ఒక్కొక్క సభ్యుణ్ణి ఎన్నుకునే నిమిత్తం ఈ మధ్యాహ్నం సంఘ ప్రత్యేక సమావేశాలు జరిగాయి. శ్రీ దామరాజు వెంకట్రావు (ఛైర్మన్) గా రధ్యక్షత వహించారు

సమావేశ ప్రారంభంలో శ్రీ శీర్ల బ్రహ్మయ్యగారు, ఈ సమావేశం సక్రమమైందనికాదని ఆక్షేపణ చెలిపారు. సంఘసభ్యులు 15 మంది సంఘ సమావేశాన్ని మార్చి 6 వ తారీఖున సమావేశపర్చవలసిందని రిక్విజిషన్ యివ్వగా, సమావేశం 4 వ తేదీనే సమావేశపర్చడం తమ ఆక్షేపణకు కారణమని తెలియజేశారు.

అధ్యక్షులు ఆక్షేపణను తోసివేసూ హైకోర్టుజడ్జిమెంట్ అందకముందే, చట్టం ప్రకారము తామీ సమావేశాన్ని ఏర్పాటు చేశామని అన్నారు.

తర్వాత అప్పాయింటుమెంటు కమిటీకి జనాబ్ ఎం హెచ్. జియాగారిని శ్రీ శీర్ల బ్రహ్మయ్యగారు ప్రతిపాదించగా, శ్రీ సామర్ల హరిశ్చంద్రుడుగారు బలపర్చారు. శ్రీ ఎస్. కె. వి. కృష్ణావతారంగార్ని శ్రీ తాడి అప్పలస్వామిగారు ప్రతిపాదించగా శ్రీ భోగరాజు సుబ్బరామయ్యగారు బలపర్చారు.

వోట్లుతీయగా అభ్యర్థులిద్దరికీ చెరి 15 ఓట్లు వచ్చాయి. దానిమీద లాటరీవేయగా జనాబ్ ఎం. హెచ్. జియాగారు ఎన్నికైనారు.

తరువాత కంట్రాక్ట్సు కమిటీకి శ్రీ ఈదర వెంకట్రామయ్యగార్ని శ్రీ శీర్ల బ్రహ్మయ్యగారు ప్రతిపాదించగా శ్రీ సామర్ల హరిశ్చంద్రుడుగారు బలపర్చారు. శ్రీ చిత్తులూరి సర్వేశ్వరరావుగార్ని శ్రీ కంభంపాటి కన్నయ్యగారు ప్రతిపాదించగా శ్రీ మోతే కృష్ణరావుగారు బలపర్చారు. శ్రీ సర్వేశ్వరరావుగార్కి 16 వోట్లు, శ్రీ వెంకట్రామయ్యగార్కి 14 వోట్లు వచ్చినందున శ్రీ సర్వేశ్వరరావుగారు ఎన్నికైనట్లు ప్రకటింపబడింది. (స్వ. వి.)

## అనంతపురం మున్సిపల్ కౌన్సిల్ సమావేశం

అనంతపురం, మార్చి 4: ఫిబ్రవరి 28 వ తేదీ సాయంకాలం స్థానిక మున్సిపల్ కౌన్సిల్ అత్యవసరంగా సమావేశమై ఇండియా రక్షణశాఖ మంత్రి శ్రీ గోపాలస్వామి అయ్యంగారు మృతికి సంతాపం తెలుపుచూ ఒకతీర్మానం, విద్యాశాఖమంత్రి డా॥ ఎం. వి. కృష్ణారావుగారు అనంతపురం వచ్చినప్పుడాయనకు స్వాగతపత్రం సమర్పించాలని వేరొక తీర్మానం చేశారు. సమావేశానికి ఛైర్మన్ మేడా సుబ్బయ్యశెట్టిగారు అధ్యక్షత వహించారు. మరికొన్ని తీర్మానాలు కూడా ఆఅవసర సమావేశంలో ఆమోదించారు. (స్వ. వి.)

## తెనాలి పురపాలక సంఘ సమావేశం

### కాలేజికి భవనం అద్దెకిస్తూ తీర్మానం

తెనాలి, మార్చి 4: స్థానిక మున్సిపల్ గరల్సు హైస్కూలు భవనాన్ని తెనాలి కాలేజికి అద్దెకిస్తూ స్థానిక పురపాలక సంఘంవారు తీర్మానించారు. ఛైర్మన్ వన్నపనేని వెంకట్రావుగారు సమావేశానికి అధ్యక్షత వహించారు. కమ్యూనిస్టు కౌన్సిలర్ రావి చినఅమ్మయ్యగారు మాత్రం తమ అసమ్మతిని లిఖితపూర్వకంగా ప్రభుత్వానికి తెలియచేశారు. (స్వ. వి)

## నోటీసు

### తెనాలి మునిసిపాలిటీ

1953-54 సంవత్సరమునకు ప్రథమముగ మునిసిపల్ కంట్రాక్టరుగ పని చేయ నుద్దేశించువారున్నూ, 1952-53 సంవత్సరములో కంట్రాక్టరుగ పని చేసినవారు రిజిస్ట్రేషన్ పునరుద్ధరించుకొనదలచువారున్నూ 31-3-1953 తేదీలోపుగ శ్రీ మునిసిపల్ యింజనీరు గారివద్దనుండి అప్లికేషన్సు పొంది ఫీజు చెల్లించి, దరఖాస్తులు పంపవలెను.

(సం.) పి. నాగభూషణం నాయుడు,
తెనాలి. } కమీషనరు,
28-2-53. } మునిసిపల్ ఆఫీసు.

విస్సారావు పేట సబ్ కోర్టులో
A. S. 128/1952.

అప్పిలెంటు: జిల్లేళ్లమూడి వీరయ్య.
రెస్పాండెంటు: పుసులూరి వెంకట నారాయణ రెడ్డి.

అప్పిలెంటు నీ పైని యీ నెంబరు అప్పీలు దాఖలు చేయగా నీకు పడ్డికేషన్ నిమిత్తము 13-3-1953 తేదీ వాయిదా వేసినారు. గాన నీకు గల ఆక్షేపణలు తెల్పుకోవలెను.

డి. నారాయణరావు పంతులుగారు,
అప్పిలెంటు తరఫు అడ్వొకేటు.

## కావలెను

రు 300/-జీతము; 2 వ క్లాసు టి ఏ. ఆఫీసు అద్దె, వ్యాపారముపై 2½% కమీషను యిచ్చు పద్ధతిపై సేల్సు సూపరింటెండెంట్లు కావలెను. పలుకుబడిగల స్త్రీ పురుషులు (వయసు పరిమితిలేదు) దరఖాస్తు చేయవచ్చును. సెలెక్టు కాబడిన దరఖాస్తుదార్లకు, కలకత్తాలో ట్రెయినింగు పొందు కాలములో, రు 30/- పాకెటుఖర్చుల క్రింద యివ్వబడును. వివరములకు: Eastern National Transport Service Ltd. 8/2, Hastings. St., Calcutta-1.

